## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

## Scriptures, Slokas and Stotras

- Adi Sankaracharya
- Aditya
- Adwaitam
- Ayyappa
- Bhagavad Geetha
- Bammera Pothana
- Bhagavatam
- Brahma Sutras
- Durga
- Dattatreya
- Ganesh
- Gayatri
- Guru
- Hanuman
- Hindu Marriage System
- Krishna
- Lakshmi
- Mahabharat
- Mantrapushpam
- Narada Bhakti Sootralu
- Nava Grahas
- Patanjali Yoga Sootralu
- Raghavendra
- Rama
- Ramayanam
- Rama Geeta
- Saraswathi
- Sandharbha
- Satya Sai
- Shirdi Sai
- Siva
- Slokas with meaning
- Subrahmanya
- Suktas
- Sundara Kanda
- Venkatesa
- Vishnu
- Vratas
- Upanishads
- Rigveda
- Samhitaanuvadam
- (Yoga Paranga)
- Vyasa Bhagavatam

## General

- Appeal and Objectives
- Bala Basha
- Bhakti Celebrities
- Bhakti Classicals
- Bhakti Links
- Book Reviews
- Jeji Mamayya Patalu
- Chatuvulu
- Dasa Mudrani
- Divine Guidance of Satya Sai
- Kavitha Kadambam
- Keerthanalu
- Koonalamma Padalu
- Prasnalu - Javaabulu
- Naturopathy
- Rishi Vani
- Sai Krishna's Art
- Satakalu
- Swamiji
- Tatvalu
- Telugu Special
- Useful Links
- Value Education
- Web Hunt
- Hindu Cultural
- Questions & Answers
- Yoga
- Yoga Mudralu Bandhalu
- Yogasanas (Detailed)

## Downloads

- Audio Downloads
- Bhakti Screen Savers
- Printer Friendly Page

### Pravachanaalu

- Bhaja Govindam
- Bhasmo Dhulita Vigrahaya
- Karma Siddhantam
- Class Prayers
- Kenopanishad
- Sri Narasimha Charitram
- Soundarya Lahari
- Ramana Saranagathi
- Vivekachoodamani

### Specials

- Annamayya Pada Visleshana
- Monthly
- Satsang
- Chinna Kathalu
- Class Prayers
- Human Relations
- Nadiche Devudu
- Stories of Alwars
- Stories of Bhaktas
- Stories of Indian Sages
- Stories of Nayanars
- Sankara Vangmayamu
- Special Articles
- Hinduism and Mantras
- Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కుమారీ శతకము

శ్రీప్రక్కి వెంకట నరసింహకవి

(టీకా తాత్పర్య సహితము)

1. శ్రీ భూ నీళా హైమావ
భారతు లతుల శుభవ తిగ నెన్నుచు స
త్సౌభాగ్యము నీకొసఁగఁగ
లో భావించెదరు ధర్మ లోల కుమారీ.

ఓ కుమారీ! లక్ష్మీ, భూదేవి, నీళ, హైమవతి, సరస్వతులు అయిన ముగురమ్మలు నీకు సర్వసంపదలు ఇచ్చి, సౌభాగ్యముల నిచ్చి కాపాడెదరు.

2. పెనిమిటి వలదని చెప్పిన
పని యెన్నఁడుఁ జేయరాదు బావల కెదుటన్
గనపడఁగ రాదు కోపము
మనమున నిడుకొనక యెపుడు మసలు కుమారీ.

ఈ శతకమంతయు కుమారి ఎట్లు మెలగ వలెనన్న నీతులు కలిగివుంటుంది. భర్త వలదన్న పనిని చేయక, బావగారిముందు తిరుగక, అత్తమామలను ఆడబడుచును ప్రేమ, గౌరవములతో మెలగవలెను.

3. మగనికి నత్త మామకు
దగు సేవ యొనర్చుచోట దత్పరిచర్యన్
మిగుల నుతి బొందుచుండుట
మగువలకుం బాడి తెలిసి మసలు కుమారీ.

భర్తకి, అత్తమామలకు మెలకువతో సేవలు చేయుచు మంచి పేరు తేవలయును.

4. ఆటలఁ బాటలలో నే
మాటయు రాకుండఁ దండ్రి మందిర మందున్
బాటిల్లు కాపురములో
వాటమెఱిఁగి బాల తిరుగ వలయు కుమారీ.

ఆట పాటలలో గాని, కాపురము చేయునపుడు కాని నిష్టూరపు పలుకులు రాకుం డ జాగ్రత్తపడవలయును.

5. చెప్పెడి బుద్ధులలోపల
దప్పకు మొకటైన సర్వ ధర్మములందున్
మెప్పొంది యిహపరంబులఁ
దప్పింతయు లేక మెలఁగ దగును కుమారీ.

చెప్పెడి నీతులు జాగ్రత్తగ విని పాటించిన ఇహ పరములందు సౌఖ్యదాయకములు పుట్టినింటికి, మెట్టినింటికి మంచి పేరు వచ్చును.

6. పరపురుషు లన్నదమ్ములు
వరుడే దైవంబు తోడి పడుచుల్ వదెనల్
మఱఁదండ్రు నత్తమామలు
ధరఁ దల్లియుఁదండ్రి యనియు దలపు కుమారీ

పరపురుషులను అన్న దమ్ములుగను, భర్తను దైవముగను, అత్తమామలను, ఆడబి డ్డలను స్వజనముగను భావింపవలెను.

7. నోరెత్తి మాటలాడకు
మాఱాడకుఁ గోపపడిన మర్యాదలలో
గోరంత తప్పి తిరుగకు

మీరకుమీ యత్తపపనుల మెలఁగు కుమారీ.

బిగ్గరగా మాట్లాడక, సహనముతో, శాంతముతో, ఓరిమితో, కూరిమితో అత్తింట మెలగవలెను.

8. తెచ్చినఁ దేకుండిన నీ
కిచ్చిన నీకుండిన మగని నెగ్గాడకుమీ
యొచ్చెము నీపై దేలును
రచ్చర కామాట లెక్కు అవ్వ కుమారీ.

ఎట్టి పరిస్థితులలో భర్త కెదురాడకూడదు. ధనికుడు కాని, నిర్ధనుడుకాని, నికేదేని ఇచ్చినను, ఇయ్యకున్నను నిందింపకూడదు. నిందించిన నిన్నే గయ్యాళి అని చెప్ప కొందురు.

9. మఱదండ్రు వదినె లత్తలు
మఱఁదులు బావలు కొమాళ్ళు పెద్దలు రా
నుఱవడిఁ బీటలు మంచము
లరుగులు దిగుచుండవలయు నమ్ము కుమారీ.

పెద్దల ముందు ఆసనముల మీద కూర్చునరాదు. కూర్చున్నను త్వరగా దిగవలెను.

10. పదములపయిఁ జెయి వేయక
మదవతి పతిచెంత నిద్ర మరఁగిన జేతుల్
గదలంగనీక కట్టుచు
గదఁగొని శిక్షించు యముఁడు కాంక్ష కుమారీ.

భర్త పాద సేవ సతికి మోక్షదాయకము. అట్లు పాదసేవ చేయని యువతి నరక మునకు పోవును.

11. పతి పాపపుఁ బని జెప్పిన
బతిమాలి మరల్పవలయుఁ బతి వినకున్నన్
హిత మనుచు నాచరింపుము
మతిలోపల సంశయంబు మాని కుమారీ.

భర్త చెడ్డపని చేసినను, చెప్పినను మరల్చుటకు ఓరిమితో ప్రయత్నించి, సాధ్యపడ కున్న అతని తోవ మంచిదే యని నమ్మి అనుసరించుము.

12. తిట్టినఁ దిట్టక కొట్టిన
గొట్టక కోపించెనేనిఁ గోపింపక నీ
పుట్టిన యింటికిఁ బాదము
పెట్టిన యింటికి వన్నె పెట్టు కుమారీ.

పతియే నీ కన్ని విధములైన అండ. అతనే దైవము. అతను కోపించినను నీవు కోపింపక ఓర్మితో నుండుము.

13. పతి పరకాంతలతో సం
గతిఁజేసిన నాదు పుణ్య గతి యిట్లనుచున్
మతిఁ దలఁ వలయు లేదా
బతిమాలగవలయు గలహ పడకు కుమారీ.

నీ మగడు పరకాంతాసక్తుడైన అది నీ యొక్క పాపఫలమని, అతనిని మార్చుటకు సర్వవిధముల ప్రయత్నించవలెనే కాని కలహించకూడదు.

14. జపములు గంగాయాత్రలు
తపములు నోములు దాన ధర్మంబులు పు
ణ్యపురాణములు పతి భక్తికి
నుపమింపను సాటిరాక యుండు కుమారీ.

పతి భక్తికి సాటియైన జప, తపములు తీర్థయాత్రలు వ్రతములు లేవు.

15. దబ్బరలాడకు గదిమాన
బొబ్బలు పెట్టకుముఁమంచి బుద్ధిగలిగి యెం
దెబ్బరిక ముఁబూనక కడు
గొబ్బునఁ జిత్తమున వాని గూర్చు కుమారీ.

15. అబద్ధములాడక, భర్త కెదురాడక, వినయముతో మెల్గుము కుమారి.

16. ఇరుగు పొరుగిండ్లకైనను
వరుఁడో కాక అత్తగారో వదినయొ మామో
మఱఁదియొ సెలవీకుండగఁ
తరుణి స్వతంత్రించి పోవ దగదు కుమారీ.

స్వతంత్రించి ఇరుగు పొరుగిళ్లకు అత్తవారింటి అనుమతి లేక పోకూడదు.

17. కూతురుఁ చెడుగై యుండిన
మాతదె తప్పన్న మాట మది నెఱుంగుదుగా
నీ తలిదండ్రులకు నప
ఖ్యాతులు రానీయగూడ దమ్మ కుమారీ.

నీ తల్లి దండ్రులకు చెడ్డపేరు రాకుడదన్న నీవునియమముగ నడుచుకొనవలెను.
పుత్రిక ప్రవర్తన సరిలేకున్న జనులు తల్లినందురు.

18. పతి భుజియించిన పాత్రను
మెతుకొక్కటియైన భార్య మెసంగుటకై తా
హిత మూనకున్న నది యొక
సతియే కడుఁ బాపజాతి జగతి కుమారీ.

పతివ్రత భర్త యొక్క ఎంగిలి ఒక మెతుకైనను తినును. అట్లుకాని నాడు ఆమెను పాపాత్మురాలందురు.

19. ధనహీనుఁడైన గడు దు
ర్జనుఁడైన గురూపియైన జారుండైనన్
విను పాపియైన నెప్పడుఁ
దనపతియే తనకు దైవ తంబు కుమారీ.

కులస్త్రీ తన భర్త ఎట్టి వాడైనను (దుర్మార్గుడు, కురూపి నిర్ధనుడు) దైవముగనే ఎంచును.

20. తన బావల పిల్లలయెడఁ
దన మఱఁదల పిల్లలందు దన పిల్లలకం
టోను మక్కువ యుండవలెన్
వనితల కటులైన వన్నె వచ్చు కుమారీ.

బావల, మరదుల పిల్లలయందు, స్వంత పిల్లలకన్న ప్రేమ చూపించు స్త్రీ అధిక కీర్తి మందురాలు.

21. అమ్మకు రెం డబ్బకు రెం
డిమ్మహిఁ దిట్టించు కూతు రెందుకు ధర నా
ద్రిమ్మరి పుట్టకపోయిన
నిమ్మళమని యండ్రు జనులు నిజము కుమారీ.

తల్లి, దండ్రులను తిట్టించు కూతురు ఈ భూమిపై పుట్టనేటికి అని జనులనుకొందురు.

22. ధనవంతుఁడైన యప్పడుఁ
పెనిమిటి చిత్తం బెఱిగి పెండ్లాము మెలం

గుసు లేమి మెలఁగ నేర్చిన
వనితకు లోకమున వన్నె వచ్చుఁగుమారీ!

భర్త ధనికుడైనను, నిర్ధనుడైనను ఒకేరీతి అణకువ జూపు స్త్రీ గొప్ప ఇల్లాలనిపించు కొనును.

23. కడుపారఁ గూడుఁ గూరలు
దొడవులు వస్త్రములు మిగుల దొరకవనుచుఁడా
పడితనమునఁ బెనిమిటితో
నెడఁబాసి చరింపఁగూడ దెపుడు కుమారీ!

స్త్రీ తన లౌకిక సుఖములగోరి భర్తను విడువకూడదు.

24. మృతియైనను బ్రతుకైనం
బతితోడనె సతికిఁ చెల్లఁ బతిబాసి యా
బ్రతుకొక బ్రతుకా? జీవ
న్మృతిగాక వధూటికెన్న నిదియుఁ గుమారీ!

చావైనను, బ్రతుకైనను భర్తతోడిదే. భర్తను విడచిన స్త్రీ చచ్చిన దానితో సమానము. ఇది ఎన్నడును మరువకూము కుమారీ.

25. తలిదండ్రు లన్నదమ్ములు
తులఁదూగగ నిమ్ము పసిడిఁతోనైనను వా
రలయింట సతత ముండుట
వెలఁదికి మర్యాదగాదు వినవె కుమారీ.

ఓ కుమారీ! పుట్టినింట ఎంత భోగ భాగ్యములున్నను స్త్రీకి అత్తింటనే గౌరవము.

26. పోకిళ్ళు పోక పొందిక
నాకులలోఁ బిందెరీతి నడఁకువగా నెం
తో కలసిమెలసి యుండిన
లోకములోపలను దా వెలుంగుఁ గుమారీ!

ఆకుచాటు పిందె వలె అణకువతో వుండు స్త్రీకి లోకమందు విశేష గౌరవము కలుగును కుమారీ.

27. పిల్లలఁ గనుగొన దలఁచిన
యిల్లాలు గతాగతంబు లెఱుఁగక ఱాఁగై
యల్లరిఁ బెట్టినఁ జెడుఁ దా
నుల్ల సములఁ బడును, గీడునొందుఁ గుమారీ!

పిల్లలను కనదలచిన స్త్రీ యుక్తాయుక్తము లెరుగక భర్తను అల్లరి చేసిన యెడల తాను కష్టములపాలై చెడ్డపేరుతెచ్చుకుంటుంది.

28. పతి కత్తకు మామకు స
మ్మతిగాని ప్రయోజనంబు మానఁగవలయున్
హిత మాచరింపవలయును
బ్రతుకున కొక వంక లేక పరఁగుఁ గుమారీ!

పతికి, అత్తమామలకు అయిష్టమైన పనులను నేర్పరియైన స్త్రీ చేయదు కుమారీ.

29. అత్తపయిన్ మఱఁదలిపయి
నెఁత్తిన కోపమున బిడ్డ నేడ్పించుటకై
మొత్తినఁ దనకే కీడగుఁ
జిత్తములో దీరిఁ జింతసేయు కుమారీ!

అత్తమీద కోపం దుత్తమీద చూపిన చందాన తన పిల్లలను హింసించుకొన్న

తనకే చేటు.

30. జీవములు భర్త పదరా
జీవములని చిత్తమందు జింతించిన ల
క్ష్మీవల్లభు చరణంబుల
సేన లతాంగులకు నెమ్మి జేయు కుమారీ!

పతి పాదసేయ జేయు తరుణకి విష్ణు సాయుజ్యము లభించును.

31. మగని ప్రియ మబ్బె నసుచును
దెగ నీలిగి యింటివారి దిగఁద్రొక్కుచు దుం
డగురాలై తిరిగిన సరి
మగువలలో నిదియె తప్పమాట కుమారీ!

భర్త చనువిచ్చినాడని బంధుజనమును, స్వజనమును చుల్కన చేసిన స్త్రీ తన గౌరవమునే పొగొట్టుకొను కుమారీ.

32. కడుబుద్ధి గల్గ మెలఁగినఁ
బడతుక, పుట్టింటివారు పదివేల వరా
లిడుటకంటె గీర్తియగు ద
మ్మిడి లేకుండినను నేర్చి మెలఁగు కుమారీ!

స్త్రీ తన గుణ గణములచే కీర్తింపబడును గాని భోగభాగ్యములకాదు.

33. తనకెంత మేలుచేసిన
మనమున కింపైన పనులు మసలిన దాసీ
వనితల కెన్నటికైనను
జనవిచ్చి మెలంగరాదు జగతి కుమారీ!

పనివారికి ఎంతకూర్చువారైనను అతి చనువు నీయకూడదు.

34. కడుఁ బెద్దమూటఁ దెచ్చినఁ
జెడుగై వర్తించెనేని జిరతర చింతం
బడుదురు తలిదండ్రులు తో
బడుచులు సోదరులు నింద బడుదురు కుమారీ!

చెడునడత కల్గిన స్త్రీని ఎవరును గౌరవింపరు.

35. బద్దకము సంజ నిద్దుర
వద్దుసుమీ దద్దిరంబు వచ్చును దానన్
గద్దింతు రింటివారలు
మొద్దందురు తోడివారు ముద్దు కుమారీ!

బద్ధకము, సంజవేళల నిదుర ఏ స్త్రీకిని తగదు కుమారీ.

36. పుట్టింటివారి నీచతఁ
బెట్టకు మత్తింటివారు పెట్టెడి బాధల్
పుట్టింటఁ దెలియనీయకు
రట్టడి చెలియందు రదియె అవ్వ కుమారీ!

కుమారీ! స్త్రీకి పుట్టింటి సంగతులు అత్తింట, అత్తింటి సంగతులు పుట్టినింట చెప్పి
న చులకనయగునే గానీ గౌరవము పొందదు.

37. ఇంటగలఁ గుట్టు నీపొరు
గింట రవంతైనఁ దెలువ నేగకు దానన్
గంటసపడి నీవారలు
గెంటించెద రిల్లు వెడలఁ గినుక కుమారీ!

'ఇంటిగుట్టు లంకకు చేటు' అన్న చందాన ఇంటి గుట్టు ఎవరికిని తెలియనీకుండుట స్త్రీ కర్తవ్యము కుమారీ.

38. వేకువ జామున మేల్కని
పైకి వెడలి వచ్చి ప్రాఁచి పని దీర్చవలెన్
లేకున్నఁ దెల్లవారిన
లోకులు నవ్వుదురు సభలలోన కుమారీ!

కుమారీ! వేకువజామున నిద్రలేచి పాచిపనులు జేసికొనవలెను. లేకున్న సోమరి యందురు.

39. తలవాకిట నెల్లప్పడు
నిలువఁగ రాదెప్పడెంత నిద్దురయైనన్
వెలఁకువ విడరాదు సుమీ
తలనడచుచు విప్పికొనుట తగదు కుమారీ!

తగని పనులు తలవాకిట నిలచుట, నడుచుచు జుట్టు విప్పుకొనుట ఎంతటి మొద్దు నిద్దురనైనను మెలకువ అవసరము.

40. కులదేవతలకుఁ బెట్టిన
పొలుపున దనయింటి యాడు బొట్టెలకెల్లన్
గల మాత్ర మొసఁగకుండినఁ
గలత పొడము దానమేలు గాదు కుమారీ!

ఇంటి ఆడబడుచును గౌరవించుట, సఖ్యముతో మెలగుట ముఖ్యము కుమారీ.

41. ఇక్కడి దక్కడ నక్కడి
దిక్కడ జెప్పినను వారి కిద్దరికిఁ బగల్
పొక్కినఁగల చేడియల

మ్మక్కా యిడుమళ్లమారి యండ్రు కుమారీ!

చెప్పడు మాటలు చెప్పి ఇతరుల మధ్య కలహముల పెట్టు స్త్రీని తంపులమారి యందురు.

42. నడకలలో నదుగుల చ
ప్పడు వినఁబడకుండవలయు భువి గుంటలు క
న్పడరాదు మడము నొక్కుల
బడఁతుల మర్యాద లెఱిఁగి బ్రతుక కుమారీ!

నెమ్మది తనమే స్త్రీలకు ఆభరణము. నడుచునప్పుడు అడుగుల సవ్వడి వినపడకూడదు.

43. వారికి వీరికిఁ గలిగెను
గోరిన వస్తువులు మాకుఁ గొదువాయె నటం
చూరక గుటకలు మ్రింగుట
నేరముగాఁ దలపవలయు నెలత కుమారీ!

ఇతరులకున్నది, తనకులేదు అను ఏడ్పు స్త్రీకి రెండు కళ్ళూ పోయినట్లే.

44. కొన్నాళ్ళు సుఖము కష్టము
కొన్నాళ్ళు భుజింపకున్నఁ గొరగాదు సుమీ
పున్నమదినముల వెన్నెల
యెన్నంగ నమాసలందు నిరులు కుమారీ!

కలిమి లేములు కావడి కుండలని, సుఖదు:ఖములు చీకటి వెలుగులని తలచే స్త్రీ గుణవంతురాలు.

45. నవ్వంగకాదె పలుమరు
నవ్విన( జిఱునవ్వుగాని నగరాదెపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వన కానంగ( బడెడి జాడ కుమారీ!

'నవ్వు నాలుగువిధాల చేటని' స్త్రీ పలుమారు నవ్వరాదు.నవ్వినను చిరునవ్వేగాని, పగలబడి నవ్వుట కూడదు.

46. పొంతపని సేయకెన్నడు
పంతంబులు పలుక(బోకు ప్రాఙ్ముఖముగ నీ
దంతంబులు దోమకు మే
కాంతంబులు బయలుపరుప కమ్మ కుమారీ!

కుమారీ! సగము పనులు చేయుట, ఇతరులతో పంతములాడుట, సూర్యునికి ఎదురుగా ముఖము కడుగుట, ఇతరులకు రహస్యములు చెప్పట కూడని పనులు.

47. వేళాకోళంబులు, గ
య్యాళితనంబులును జగడ మాడుటలును గం
గాళీపోకలు గొండుము
లాలోచించుటయు( గూడ వమ్మ కుమారీ!

ఉత్తమ స్త్రీలకు కూడని పనులు. వేళాకోళములు, గయ్యాళితనము చాడీలు చెప్ప ట మొదలగునవి.

48. తొడవులు మిక్కిలి గలిగిన(
కడు(బ్రేమన్ మగ(డు మిగుల గారామిడినన్
బడతు(క పసుపుం గుంకుమ
గడియైనను విడువరాదు గాదెకుమారీ!

స్త్రీకి పసుపు కుంకుమలు అన్నింటికన్న విలువైనవి.

49. బంతులను బక్షపాత మొ
కింతైనను జేయరాదు హీనదశుల సా
మంతుల నొకభంగి నిరీ
క్షింతువు బుధులెల్ల సంత సిల్ల కుమారీ

బంతితో బలపక్షము చూపుట తగనిపని కుమారీ.

50. చెడుగులతో లంజెలతో
గుడిసేటులతోడఁబొత్తు కూడదు మది నె
ప్పడు నిల నుత్తమకాంతల
యడుగులకున్మడుగులొత్తు మమ్మ కుమారీ!

చెడు స్నేహములు చేయక పతివ్రతల పాదముల పూజింపవలెను కుమారీ.

51. మాసినతల మాసిన యిలు
మాసిన వలువలు దరిద్రమార్గంబులు నెం
తేసి ధనవంతులైనను
గాసిల్లుదు రల్పదశల గ్రాగి కుమారీ

శుచి, శుభ్రములు ఎవరికైనను ధనధాన్యములకైన విలువైనవి.

52. విసువగు పని తగిలినయెడఁ
గసరకు సేవకుల మిగులఁ గాంతునితోడన్
రొసరొస పూసకు మాడకు
మసత్యవచనంబు లెన్నఁ డైన కుమారీ!

పని పాటలయందు విసుగు, పనివారిని మాటిమాటికి కసురుట, భర్తతో కలహిం చుట అసత్యములు పలుకుట కూడదు కుమారీ.

53. చెప్పిన జెప్పక యుండిన
దప్పక సేయంగవలయు దనపనులెల్లన్
మెప్పొదవఁగాను లేదా
ముప్పొదవునుగాదె యెందు ముద్దు కుమారీ.

పనులయందు నేర్పరితనము చూపుట తనకే మేలు కుమారీ.

54. దీపము వెలిగించెడిచో
జీపురపుడ కుంచవలయుఁ జేతుల నంటన్
బాపము పాలౌదువు మది
లోపల నిది తలప వలయు రూఢి కుమారీ.

దీపములు వెలిగించవలెనన్న, వేరొకపుల్లతో వెలిగించక, దీపముతోనే వెలిగించిన చేతులు కాలును.

55. ఆపదలకోర్చి సంపద
నాపయి భోగింపు మనెడి హర్షోక్తుల నీ
లోపలఁ దలంచుచు లాంతరు
దీపము చందమున వెలుఁగ దివురు కుమారీ.

చలించని లాంతరులో దీపము వలె కష్టనష్టములకు చలించ కూడదు.

56. సరకులయెడ జాగ్రత్తయు
జురుకుపనులయందు భక్తి సుజనులయందున్
గరుణ యనాధుల యెడలం

దరుణికిఁ జెలువారవలయు ధరణి కుమారీ.

స్త్రీ సుగుణములు - వస్తువులయందు జాగ్రత్త, పనులయందు శీఘ్రత,
మంచివారియందు భక్తి, పేదలయందు కరుణ

57. తన కడుపు కట్టుకొనియై
నను జుట్టమునకు బెట్టి నను గీర్తివహిం
చును భుక్తిముక్తు లబ్బును
దన కెవ్వరు సాటిరారు ధరణి కుమారీ.

'అతిథి దేవోభవ' అనుచు అతిథికి సేవ జేసిన ఇహపరములందు పేరు వచ్చును.
వీరికి సాటి, పోటీ లేరు.

58. చెప్పకు చేసిన మేలు నొ
కప్పడయినఁగాని దాని హర్షింపరుగా
గొప్పలు సెప్పిన నదియును
దప్పేయని చిత్తమందు దలఁపు కుమారీ.

చేసిన మేలు గూర్చి ఇతరులకు చెప్పనివారే అనఘులు కుమారీ.

59. ఎంగిలి పరులకుఁ బెట్టకు
కంగున మ్రోయంగ నీకు కాల్మెట్టియలన్
బంగారు లాభముండిన
దొంగతనము సేయుబుద్ధిఁ దొలఁచు కుమారీ.

ఎంగిలి ఇతరులకు పెట్టకుండుట, మెట్టెల సవ్వడి వినపడకుండ నడచుట,
బంగారమునైన దొంగిలించకుండ ఉండుట మంచి గుణములు.

60. చెడుగనిపించుకొనుటకున్

గడియైనను( బట్టకుండు( గాంతలలో నె
క్కుడు గుణపతి యనిపించెడు
నడవడి నేర్చుటయె కడు నంబు కుమారీ.

బలుడు అనిపించుకొనుట సులభము, గుణవంతుడనిపించుకొనుట కష్టము.

61. తనకంటె( బేదవాండ్రం
గని యంతకు( దనకుమేలు గా యనవలయున్
దనకంటె భాగ్యవంతుల(
గని గుటకలు మ్రింగ మేలు గాదు కుమారీ!

'తనకి లేదే అని ఏడిస్తే ఒక కన్ను ఇతరులకు ఉంది అంటే రెండు కళ్ళుపోతాయి. సుఖదు:ఖములందు నిర్వికల్పుడవయి ఉండవలెను.

62. ఎంతటి యాకలి గలిగిన
బంతిన గూర్చుండిముందు భక్షింపరు సా
మంతులు బంధువులును నిసు
మంతైనను జెల్లదండు రమ్మ కుమారీ.

పంక్తి భోజనములో మర్యాదలు పాటించకున్న తిండిపోతని అన్పించుకొందువు.

63. కోపముల నప్పడాడ ని
రూపించిన మాటకొన్ని రోజులు చనినం
జూపట్టదనుచు శాంతము
లోపల( గొనవలయు ధర్మ లోల కుమారీ!

కోపము నిగ్రహించుకొనిన వాడే మానవుడన్పించు కొనును.

64. అధికారము లేనిపనుల
కధికారము సేయబోకు మంధునఁ గోపం
బధికంబగు నీవారికి
బుధులది విని హరషమొందఁ బోరు కుమారీ!

నీకు అధికారము లేని పనులందు అధికారము చెలాయించిన పెద్దలకు కోపము తెప్పింతువు.

65. విరుగబడి నడువఁగూడదు
పరుల నడకలెన్ని తప్పు పట్టఁజనదు ని
ష్ఠురములు వచింపఁగూడదు
కఱపఁగవలె మేలు మేలు గలదు కుమారీ!

అహంకారము కూడదు. నీ నడకలోనే వినయము కన్పింపవలెను.

66. తా నమ్ముడుపడియైనన్
దీనుండగు ధవునియార్తి దీర్చుట సతికిన్
మానము చంద్రమ జల
జానన దలపోయవలయు నాత్మ కుమారీ!

చంద్రమదేవి వలె తాను అమ్ముడుపోయి అయిననూ భర్త కష్ట నష్టములను ర్చునదే కులస్త్రీ.

67. సరకులు బట్టలు వన్నెల
కెరవులు తేఁదగదు తెచ్చె నేనిసరకు ల
క్కర దీర్చుకొనిన వెంటనే
మరలింపకయున్నఁ దప్పు మాట కుమారీ!

'అరువుసొమ్ము బరువుచేటు' అని తెలిసికో కుమారీ.

68. కలహపడు నింట నిలువదు
కలుముల జవరాలు గానఁ గలకాలం బే
కలహములు లేక సమ్మతి
మెలగఁగా నేర్చెదవేని మేలు కుమారీ!

ఇంటిలో కలహములు సంపదకు చేటు. శాంతి సౌఖ్యములు ఇంటిలో నెలకొల్పవలసినది ఇంతులే.

69. గొప్పదశ వచ్చెననుచు నో
కప్పడయిన గర్వపడకు మది తొలఁగినచో
జప్పట్లు జఱతు రందఱు
దప్పని దండించు దండ ధరుఁడు కుమారీ!

భోగ, భాగ్యములు చూచి అహంకరించిన అవి తొలగినపుడు పరులు గేలి చేయుదురు. యముడు శిక్షించును.

70. గురుశుక్రవారముల మం
దింగేహళులందు లక్ష్మి తిరముగ నిలుచుం
గరగరిక నలికి ముగ్గిడి
గురుభక్తి మెలంగఁబాయు గొదువ కుమారీ!

గురు, శుక్రవారములందు ఇల్లూ, వాకిలి శుభ్రత లక్ష్మీ నిలయము. కావున లక్ష్మిని స్థిరముగా నిలుపుకొనదలచిన వారు ఆ రెండు రోజులు మరింత శుభ్రము గావించుకోవలెను.

71. వాణియు శర్వాణియు హరి
రాణియు వాక్కునను మై సురంబున నుంటల్
రాణఁదిలకించి మదిలో
బాణిగ్రాహియెడ నిల్పు భక్తి కుమారీ!

సరస్వతి వాక్కునందు, పార్వతి సగము శరీరమందు, లక్ష్మి వక్షమునందు ఉండి ఏవిధముగా పతుల సేవింతురో అట్లే నీవు నీపతికి ప్రియముకూర్చుము.

72. అపకీర్తింబొందుట క
ష్టపుఁబని గాదొక్క గడియ చాలును కీర్తి
న్నిపుణత వహింపవలయును
జపలగుణములెల్ల బాసి చనగ కుమారీ!

చెడ్డపేరు తెచ్చుకొనుటకు క్షణము చాలు. మంచి పేరు తెచ్చుకొనుటకు చాలా కష్టపడవలెను.

73. సుమతియును చంద్రమతియును
దమయంతియు జానకియును ద్రౌపదియును బ
న్నములం బడి పతిభక్తిం
గ్రమమున నడపుటలుతలఁపఁ గాదె కుమారీ!

సుమతి, చంద్రమతి, జానకి వలె భర్తననుసరించి మెలగుము కుమారీ.

74. పవళించునపుడు రంభా
కువలయదళనేత్రి భంగి కోరిన రీతిన్
ధవుని కొనఁ గూర్చవలయును
దివి భువి నుతిఁ బొందునట్టి తెఱవ కుమారీ!

కుమారీ! భర్త ఇచ్ఛానుసారముగా ప్రవర్తించెడి స్త్రీ ఇహపరముల సుఖము పొందును. రతికేళిని రంభవలె ప్రవర్తించవలెను.

75. సుమతియును రమణి పతికై
శ్రమనొందుట నీచసేన సలుపుటయు వియ
ద్గమన విరోధము భానున

కమలించుయుం దలంపు మాత్మ( కుమారీ!

సతి సుమతి నాదర్శముగా చేసుకుని భర్తయే దైవముగా భావింపుము.

76. వడ్డించునపుడు తా గను
బిడ్డనికి దల్లి భంగి బ్రేమ దలిర్పన్
వడ్డింపవలయు భర్తకు
నెడ్డెతనము మానవలయు నెందు కుమారీ!

'భోజనకాలే మాతా' అన్న విధముగా పతి ఇష్టా ఇష్టముల గమనించి భర్తకు మృష్టాన్న మీయవలెను కుమారీ.

77. దానములు ధర్మకార్యము
లూనంగా( గలిగినంత( యుక్త క్రియలన్
మానవతుల కిది ధర్మము
గా నెఱి(గి యొనర్పవలయు( గాదె కుమారీ.

స్త్రీకి మంచి ధర్మమయిన దాన ధర్మములు వదలకుము.

78. ఆలోచన యొనరించెడి
వేళలలో మంతి భంగి కోరిన రీతిన్
కాలోచితకృత్యంబుల
భూలోకమునందు గీర్తి(బొందు కుమారీ!

భర్తను మంచికార్యములకు పురికొలిపి అతనికి మంత్రివలె సాయ పడవలెను.

79. పనిచేయునపుడు దాసీ
వనితవిధంబునను మేను వంపగ(వలయున్

ధనవంతుల సుతయైనను
ఘనత గలుగు దానివలనఁ గాదె కుమారీ!

పతిసేవయందు ఎంత ధనికురాలైనను దాసి వలె ఉచ్ఛనీచముల మరచి ప్రవర్తింపవలెను.

80. శ్రమయెంత సంభవించిన
క్షమ మఱువఁగరాదు ధరణి చందంబున స
త్యమున బ్రవర్తించి యా
రమణియె లోకంబునందు రమణి కుమారీ.

భూదేవి వలె ఓర్మి కల్గిన స్త్రీ ధర్మబద్ధముగా నడచి ఇతరుల మన్నన పొందును.

81. కామము సంకల్పంబున
బామొందెడుఁ దొలగుఁ దేహ భావము దెలియన్
వేమఱుఁనిది బరికించుట
క్షేమంబగు ముక్తిగని సుఖింపు కుమారీ.

కుమారీ! ఉత్తమ స్త్రీ తనదేహ సౌఖ్యములకై పాటు పడక పరోపకారమునకు ప్రయత్నించును.

82. జనియించెడు నజ్ఞానం
బున మోహగుణంబు ధర్మ మున బరికింపం
దునుమాడఁబడును దీనిం
గనుఁగొని మెఁగంగవలయుఁ గాదె కుమారీ!

మోహ వికారములు లేక ధర్మముగా నడుచుకొనవలెను.

83. ఈ రీతిఁ దిరుగ నేర్చిన

నారీమణి కీర్తిబొందు పరలోకమునం
దూఱులు తొలంగిపోవుచు
ఘోర దురిత సంఘమెల్లఁ గుందు కుమారీ.

ధర్మము తప్పని స్త్రీ మంచి పేరు గడించుటయే గాక ఇహపరములందు సౌఖ్యము పొందును.

84. కులమున విత్తంబున వి
ద్యలను మదం బుద్భవించు నాయా పెంపుల్
దలపోయ మరలు నిది హృ
జ్జలజంబునఁ దలఁపవలయు సతము కుమారీ.

గర్వించుటకు విద్యా, ధన, కుల, రూపములు కారణములు. వీనియందు అధికుల ను తలచుచూ సద్వర్తినివై మెలగవలెను.

85. బరిజనము లాచరించెడి
దురితంబున గ్రోధగుణము దోచెడి నధిక
స్ఫురణన్ క్షమ గైకొని నం
దఱు నది యెఱింగి మెలఁగ దగు కుమారీ!

'అపకారికి ఉపకారము' చేయటయే మిన్నయనుకొని శాంతము వహించుట మం చి లక్షణము.

86. బహుకష్టములం బొందక
మహిలో సమకూడఁబోదు మానవజన్మం
బహాహో యీ జన్మంబున
నిహపరములఁ గొనెడు జాడ లెఱుఁగు కుమారీ!

ఎంతోపుణ్యము చేసికొన్న గాని మానవ జన్మ లభింపదు. కాన పుణ్యఫలమును

పెంపొందించుకున్న ముక్తి లభించును.

87. దృశ్యపదార్థము లెల్లను
నశ్యములని తలఁపకుండి నన లోపంబౌ
దృశ్యంబున నస్థిరత న
వశ్యము చిత్తమునఁ దలప వలదె కుమారీ!

ప్రతి వస్తువు నశించునది అని ఎరిగి ఎద్దానియందు అధికప్రీతిని చూపకుము.

88. నేలన్ వ్రాలిన పత్రము
లోలిం జోడించి వడచు చుండిన యవియున్
జోలఁగ సునక్షపుటాకులు
దూలించు దరిద్రదశలఁ దోఁగ కుమారీ!

తాంబూలమునకు నేలరాలని, సున్నము వుంచని మంచి ఆకులనే వాడవలెను.

89. ఎన్నాళ్లు బ్రతుకఁ బోదురు
గొన్నాళ్లకు మరణదశల గ్రుంగుట జగమం
దున్నట్టివారి కందఱి
కిని హితము సతము మంచి కీర్తి కుమారీ!

ప్రపంచమున కీర్తియే శాశ్వతమని ఎరిగి కీర్తినిచ్చు పనులనే చేయుము కుమారీ.

90. మాత్సర్య మొదవు సత్యము
హృత్సరసీజమున లేమి నెల్లప్పడుఁ దా
సత్సేవయందుఁ దిరిగిన
మాత్సర్య మణగుఁ దెలిసి మనుము కుమారీ!

సత్సాంగత్యముచే ఈర్ష్యను పొగొట్టుకుని నడచుకొమ్ము.

91. పెనిమిటికన్నఁ బతివ్రత
మునుపే మృతిబొందెనేని బురుషాగమనం
బున కెదురుచూచుచు వచ్చిన
గనుకొని యనురాగ మెనయఁ గలయు కుమారీ!

పతివ్రత ముందు మరణించిననూ భర్తకొరకే ఎదురుచూచునమ్మ కుమారీ.

92. తుడుపు దుమారమ్మును జెరు
గుడు ధూళియు మేషరజముఁ గూడదెపుడు మైఁ
బడనెఱిఁగి తిరుగ నేర్చిన
బడతుక మర్యాద లెఱిఁగి బ్రతుకు కుమారీ!

ఎటువంటి ధూళియు (తుడుచునపుడు, చెరుగునపుడు) తనమీద పడకుండున
ట్లు నడచుకొను స్త్రీయే మర్యాద లెరిగిన యువతి.

93. మునునాథుఁడు తరలినచో
వెనువెంటనే పోయి యెల్ల వేల్పులు వొగడం
గని పొందు విందునందును
ఘనకీర్తులఁ బొందుచుండు గాదె కుమారీ!

భర్తతో పాటుగా మరణించిన యువతి దేవతలచేత కూడా స్తుతింపబడును.

94. ఇద్దరు గూడుక మొకచో
నొద్దిక మాటాడుచుండ నొదిగి మొదిగి యా
యొద్దకుఁ జనగూడదు తన
పెద్దతనం బెల్ల నణఁగ బెట్టుఁ కుమారీ!

ఇరువురు వ్యక్తులు రహస్యములు మాటలాడుచున్న, వినరాదు. అట్టు వినిన

తన గౌరవము పోవును.

95. మఱపవలెఁ గీడు నెన్నఁడు
మఱువఁగారాదు మేలు మర్యాదలతో
దిరుగవలె సర్వజనములం
దరి బ్రేమ మెలంగవలయు ధరణి కుమారీ!

ఇతరులు చేసిన మేలు మరువక, కీడును తలపెట్టక మరచిననే మర్యాద, ప్రేమ.

96. దీపముల నీడ మానవ
రూపంబుల నీడ శనితరుల నీడను ఖ
ట్వాపాదితమగు నీడల
నేపట్టున నిలువఁగూడ దెపుడు కుమారీ!

మనిషి దీపపు నీడలో, మనిషి, తాటిచెట్టు, మంచము నీడలో నిలువరాదు.

97. ఆకులొసఁగినఁ జేకొని
పోఁక నమిలి సున్నమడుగఁ బోయినఁగని యీ
లోకులు నవ్వుదురు సుమీ
కై కొనవలె మంచితడత ఘనత కుమారీ!

ఆకులు చేతపట్టి వక్కలు నములుచు, సున్నము అడుగువాని జనులు నిందింతు
రు. సద్వర్తినివై మెలుగవలెను.

98. కొనగోట వ్రేలు వెండ్రుక
లను జాటెడు నీళ్లకుండ లను ముంతల వా
డినవెన్క మిగులు నీళ్లను
జనదండ్రు దరిద్రమొందు కుమారీ!

కొనగోటినీళ్లు శరీరమున, తల వెంట్రుకల నిండి నీళ్లు నట్టింట పడకూడదు. కుండల అడుగునీళ్లు వాడకూడదు.

99. సన్నెకలున్ బొత్రమ్మును
దన్నుకుపోరాదు కాల దగిలిన యెడలన్
కన్నుల నద్దుకొనన్వలె
గ్రన్నన సిరియందు నిలుచుఁ గాన కుమారీ!

సిరి ఇంట నుండుటకు సన్నికల్లును, పాత్రమును తన్నుకొని పోరాదు.

100. ధరఁ బ్రక్కికులుఁడు వేంకట
నరసింహకవీంద్రుఁ డిట్టి నడతలు ధరపై
దెఱవల తెఱవు లటంచును
జిరతర స్మర్తి వెలయఁ జెప్పె కుమారీ!

ప్రక్తి వెంకట నరసింహకవి ఈ భూమి మీద కీర్తిని కోరు స్త్రీలకు ఉపయోగపడు నీతులను ఇందు రచించెను.

ఈ శతక కర్త వ్రాసిన కొన్ని నీతులు నేటి సహజీవన సమాజములో వర్తింపకున్నను కొన్ని నిత్య సత్యములు వున్నవి. ఏ సమాజము లో నైనను పురుషుని నడవడి కన్న స్త్రీ నడవడి ప్రధానము. ఆమె ఒక కుటుంబమును భర్తను, పిల్లలను దిద్దును. అందుకే ఆమెకు అత్యున్నత స్థానము నిచ్చారు.